# శ్రీ రామరామ శతకము.

గ్రంథకర్త.

ఆర్. రామదాసు,

టీచర్, గుంతకల్లు, క్రొత్తగాల.



ఏలూరు రామా పవర్ ప్రెస్సునందు,

ఈదర వెంకట్రావుచే ముద్రింపఁబడియె.

1930

# విజ్ఞప్తి.



పాఠకమహాశయులారా!

నేనీశతకంబును వ్రాయుటకిదియే ప్రథమ ప్రయత్నము. భాషా పరిచయముగాని, రచనా విధానముగాని, యంత బాగుగా నెఱుంగని నేను నీశతకంబును నాయిష్ట దైవంబగు శ్రీపరమాత్మ కృపావీక్షణ చే రచించియున్నవాడ. ఇందనేక స్ఖాలిత్యములు మీకు గాన్పించును. వాని నన్నియుం దమరు నాకెఱింగించినచో మీకు నమస్కార శతంబు లర్పించుచు ముందు ముద్రణమునం దా దోషములను సవరించుకొనుచున్నాడను.

గుంతకల్లు, కొట్టాల,
గుత్తితాలూకా.
14—10—30.



ఇట్లు భాషాభిమాని,
ఆర్. రామదాసు.
గ్రంథకర్త.



## 1. రా జ పో ష కు లు.



1. గొర్తి పెద్దసుబ్బయ్య నాయుడుగారు.
2. గొర్తి చిన్నసుబ్బయ్య నాయుడుగారు.
3. గుండాల చిన్నారప్ప నాయుడుగారు.
4. తమ్మినేని సుబ్బయ్య నాయుడుగారు.
5. చింబిలి పెద్దరంగయ్య నాయుడుగారు.
6. ఉమ్మనబోయిన పెద్దపాపయ్యగారు.



## 2. ప్ర ధా న పో ష కు లు.



1. చల్లా చిన్నరామయ్యగారు.
2. కాకర్ల రంగప్ప నాయుడు.
3. గుండాల అంజనయ్యగారు.
4. చల్లా పెద్దప్పగారు.
5. అక్కన్నపల్లి చిన్నరంగప్పగారు.
6. అంద్ర కొండయ్య గారు.



# శ్రీరామరామ శతకము.

## ఇష్ట దేవతా స్తుతి.



శ్రీరామ రఘుకుల ♦ క్షీరాంబునిధిసోమ
ధీరధర్మావన ♦ తే నమోస్తు
శ్రీధారుణీసుతా ♦ శ్రితపాద పంకజ
దేవతా నుతరక్ష ♦ తే నమోస్తు
దానవోద్రేక దం ♦ తావళి హర్యక్ష
దీనకల్పక వృక్ష ♦ తే నమోస్తు
చంద్రశేఖర దేవ ♦ సన్నుతాంచితపాద
తిరుపతి నగవాస ♦ తే నమోస్తు

తే. గీ. పంకజాతాక్ష శ్రీరామ ♦ పరమ పురుష
త్రిజగ సన్నుతపాలన ♦ తే నమోస్తు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ.

కమలా మనోహరా ♦ కమల దళేక్షణ
కమలాప్త కులకంధి ♦ కమలవైరి
పాదోధి సంచార ♦ పాదోధి గంభీర
పాదోధి శయన ♦ బాహాప్రతాప

నాగారి సద్వాహ ♦ నాగేంద్ర సమబాహ
నాగభూషణవంద్య ♦ నాగశయన
దానవాంతక రామ ♦ దాశరథీరామ
తాటకాంతక రామ ♦ ధైర్యధామ

గీ. సరసిజాసన సన్నుత ♦ సారసాక్ష
సరసిజ నివాసినీపతి ♦ పరమపురుష
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ 2

రాజీవభవదేవ ♦ రాజీవ హితతనూ
జాతసంస్తోత్ర + జో ♦ హారునీకు
మదనకోటి స్వరూప ♦ మధుకైటభాంతక
హరిదశ్వవరదజో ♦ హారునీకు
దాసజనసంరక్ష ♦ దానవాంతక రామ
సద్గుణస్తోమ జో ♦ హారునీకు
సురపతీ సంస్తోత్ర ♦ సుగుచి తాంచితరూప
కరుణా స్వభావజో ♦ హారునీకు

గీ. కంజదళనేత్ర శ్రీచారు ♦ కలితధామ
విమల చారిత్రజోహారు ♦ వినుముగనుమ
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురణివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 3

—♦ గ్రంథకర్తృవంశము. ♦—

శ్రీ రమేశుని నాభి ♦ సరసిసంభవభవుం
డే భూమి సుతునకు ♦ న్నేడు గడయు
గౌతమభృగు గర్గ్య ♦ కశ్యపాత్రి వశిష్ఠు
లే మహాని సత్సంగ ♦ నిష్ఠులరయ
నగభేది సుతుశస్త్ర ♦ నాచార్యుడైనట్టి
కలశజుండే మహాని ♦ కరముపట్టి
వల్మీక భవయోగి ♦ వరున కత్యంతుడై
యే మహానిశిష్యుడై ♦ ఎసగె జగతి
గీ. అట్టి సన్మౌని శ్రీభర ♦ ద్వాజమహాని
గోత్రమందున నీకవి ♦ నుద్భవించె
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 4

రత్నాకరాన్వయా ♦ ర్ణవశీత భానుండు
నానొప్పు పెదరామ ♦ దాసరాజు
నాథునకు నాగ్గు ♦ రాత్మతనూభవు
ల్నరయగా సంజీవ ♦ రాజు రామ
రాజో బళారాజ ♦ నాగ్రాజ కోదండ
రాజన బాల్రామ ♦ రాజనంగ
నందు కోదండ్రాజ ♦ యాఖ్యునకంచిత
స్సుతుడనై రామదా ♦ సాంఖ్యుడనగ

గీ. వెలసెభువిమీఁద శ్రీరమా ♦ విభునిపాద
పద్మ సేవానుభావుఁడై ♦ ప్రకటితముగ
ధరణిగుంత కల్లుకొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 5

పరమేశ నీమీఁద ♦ పద్యముల్జెప్పతి
వేముదంబున చిత్త ♦ గింపుమయ్య
చందస్సు శాస్త్రముల ♦ క్షణము నేర్వఁగలేదు
సద్గ్రంథములనెల్ల ♦ జదువలేదు
శబ్దక్రమంబును ♦ సాధింపగాలేదు
గణయతిప్రాసంబుఁ ♦ గాంచలేదు
భావనా చిత్రంబు ♦ పసయేమి యునులేక
నీకటాక్షంబుచే ♦ నిట్టులేను

గీ. జెప్పియున్నాఁడ శతకంబు ♦ చిద్విలాస
వేగఁగైకొమ్ము నామొర ♦ వినియుఁగనియు
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురణివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 6

సర్వ ప్రపంచంబు ♦ సరవితో సృజియించు
నొకమారు సృజియింప ♦ కూరకుండు
భర్తదానై బ్రోచుఁ ♦ బరికించి నొకవేళ
నొకవేళ సాక్షియై ♦ యూరకుండు

రూపనామక్రియల్ ♦ చూపించు నొక వేళ
నొక వేళ నవిమాని ♦ యూరకుండు
దుష్టసంహరణంబు ♦ నోపించు నొక వేళ
నొక వేళ సముదృష్టి ♦ యూరకుండు
గీ. యుగయుగంబున ధర్మ ♦ రక్షణము కొఱకు
స్వైరవిహరణ గలసార ♦ సాక్షుదలంతు
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామ రామ. 7

పాదారవింద ప్ర ♦ భావంబుఁ జాటింప
పరగంగ స్యాతము ♦ పత్నిసాక్షి
దుర్వారశస్త్రాస్త్ర ♦ దోఃప్రతాపుండని
చాటింప శివధను ♦ స్సరయసాక్షి.
నిజదాసు లర్పించు ♦ నృజన పుణ్యంబుల
సమితిని గొనుటకు ♦ శబరిసాక్షి
అతిదయా సంపూరి ♦ తాంతరంగుండని
నచియింపను హనుమత్పై ♦ వన్నె సాక్షి
గీ. ఇట్టిసాక్ష్యం బహర్నిశం ♦ బిచ్చుచుండు
అనవతర మెంతునను శ్రీవు ♦ మనుజసాక్షి
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ 8

శతపత్రహితపుత్ర ♦ సంశ్రిత భటభీక
　　రోరగాళికి విహం ♦ గోత్తమంబు
జన్మసంచితఘోర ♦ చండౌఘ ప్రళయాభ్ర
　　చయములపాలి ♦ ఝంఝానిలంబు
వాతపిత్తశ్లేష్మ ♦ వ్యాధి భీకరదుర్గ
　　మారణ్యదహనద ♦ వానలంబు
ఘనఘోర దారిద్ర్య ♦ కలిత సంతాపోత్ర
　　వారణప్రకరకం ♦ ఠీరవంబు.

గీ. సర్వరోగాదికుటిజ సం ♦ ఘంబునకును
పరశుతావక పదపద్మ ♦ పరమవినుత
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. ౯

ధరణీజచిత్తాబ్జ ♦ ద్వాదశాత్మ ప్రభా
　　యోగి హృత్కమలాళి ♦ యోగనిలయ
పాకశాసన యమ ♦ ప్రముఖ దేవక్లేశ
　　తమపుంజలోక భాం ♦ ధవ మహాత్మ
భక్తగణార్థిత ♦ బహుఫలదాయక
　　సత్పారిజాతభూ ♦ జాతవరద
దుర్వారదానవ ♦ గర్వేభహర్యక్ష
　　హరపితామహ వంద్య ♦ హరిముకుంద

గీ. నిగమసన్నుత పరిపాల ♦ నీరజాక్ష
ప్రణవసంయుక్త హరిరామ ♦ పరమపురుష
ధరణిగుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 10

ప్రకటితోగ్రంబైన ♦ పాతకాబ్ధికి సదా
బడబాగ్ని మీనామ ♦ పఠనమరయ
దుర్వార భవయూథ ♦ దావాగ్నికీలకు
శుభవృష్టి మీనామ ♦ స్తోత్రమరయ
దుర్మలినాచార ♦ దోష ఘోరాటవి
విదళింప పరశుమీ ♦ వినుతి యరయ
శ్లేష్మాంచిత వ్యాధి ♦ చింతానగంబుల
నిర్జింప కులిశంబు ♦ నీ దుకరుణ.

గీ. ప్రథితమరి షడ్గుణాంధ ♦ కారంబునకును
భానుపటలంబు మీనామ ♦ ప్రస్తుతరయ
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 11

శ్రీరమాధిపుసేవ ♦ జేయ దుర్వారమహా
దోషాది పటిలము ♦ తొలఁగిపోవు
సర్వేశ్వరుని చిత్ర ♦ చారిత్రములువిన్న
సంసార భయములు ♦ సమసిపోవు

నారాయణుని దివ్య ♦ నామ సంస్తుతిఁ జేయ
భవరోగ బాధలు ♦ పరుగులిడును
శ్రీరామ మంత్రంబుఁ ♦ దెలిసి జపించిన
పరమైన పదమబ్బు ♦ కరమునందు
గీ. సుజనవరులార ధీనుత ♦ సుగుణులార
చక్రధరు పూజ సేయుడీ ♦ జగతిజనుఁడు
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 12

శ్రీభాను వంశాబ్ధి ♦ సోమ తారక నామ
పంకజాతాక్ష శ్రీ ♦ పరమపురుష
భక్తసంఘస్తోత్ర ♦ భక్తక్లేశచ్ఛేద
భక్తకల్పకవృక్ష ♦ భక్తవరద
దాశరథీ రామ ♦ దానవాంతక రామ
దాటకాంతక మహో ♦ దైర్యధుర్య
కమల సంభవనుమా ♦ కాంతసన్నుత పాద
యుగళ ప్రభాజాల ♦ నురగశయన
గీ. సకల కల్యాణ గుణధామ ♦ సార్వభౌమ
త్రిజగసన్నుత చారిత్ర ♦ దేవ దేవ
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ. 13

శ్రీరమాశేమన ♦ శ్రోరభక్తస్తుత్య
పాలించరానన్ను ♦ పరమపురుష
శ్రీసరోజ దళాక్ష ♦ శితికంఠ సంస్తుత
పోషించరాభక్త ♦ పోషరామ
శ్రీభాస్కరాన్వయ ♦ సింధుసోమా రామ
గడతేర్చరా నన్నుఁ ♦ గమలనయన
శ్రీరమ్య గుణధామ ♦ శ్రీరామ రఘురామ
కరుణతో నను బ్రోవు ♦ కామజనక

గీ. యనుచు పలుమారు నిన్ను నే ♦ ననుదినంబు
సంస్తుతించితి బ్రోవుమా ♦ సదయ హృదయ
ధరణి గుంతకల్లుకోట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 14

రక్షించుగుణశాలి ♦ రక్షకుండని నేను
గట్టిగానమ్మితిఁ ♦ గమలనాభ
రక్షింపమీకన్న ♦ రక్షకులెవ్వరింక
శిక్షింపఁదప్పేమి ♦ జేసినాడ
బ్రాపునీవని నేను ♦ పలుమారు వేడితిఁ
బంతంబుచాయకు ♦ భక్తవరద
కన్నపుత్రులపైన ♦ కఠినములూపుట
పాడిగాదేసీకును ♦ పరమపురుష

గీ. తప్పులన్నియు క్షమింపఁ ♦ దండ్రివీవె
యనుచు వేడితిననిశంబు ♦ నమరవినుత
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 15

శ్రీర క్తవిద్రుమాం ♦ చితరాగమధరంబుఁ
గల్గిన సవ్వమొ ♦ గంబువాడు
శ్రీజాహ్నవీఘల్ల ♦ సిత పద్మమాలికాం
చిత కంబుకంఠంబు ♦ జెలఁగువాడు
చారుకౌమోదకీ ♦ శంఖచక్రగదాది
శాహుచతుష్టయ దేహ ♦ బలమువాడు
వరసరసీరుహ ♦ పల్లవాస్పదపాద
మంజీరరవముచే ♦ మలయువాడు

గీ. సరసకరుణాదృష్టి వరలు ♦ సర్వేశుండు
పెచ్చు ప్రీతినన్ను ♦ మెచ్చుగాత
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 16

శ్రీరమాహృదయరా ♦ జీవోష్టకిరణుండు
భానుకోటిప్రభా ♦ భాసురుండు
సప్తాశ్వసత్కుల ♦ శ్వరనిధి చంద్రుండు
భక్తప్రకరకల్ప ♦ పాదపంబు

దైవప్రకాండ చా ♦ తకమేఘ ముజ్వల
కాంతిసమూహంబు ♦ గలుగువాఁడు
గర్వాంధ పరిపంథ ♦ గంధసింధురవర్గ
హర్యక్షశౌర్యబా ♦ హాప్రతాపు
గీ. డనగ విలసిల్లు శ్రీపరం ♦ ధాము రాము
భజనసేయుడి మోక్షంబు ♦ బడయవచ్చు
ధరణిగుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 17

ఎవ్వాని పదకాంతి ♦ వీక్షింపఁ జాలక
కమలముల్కమలాప్త ♦ కాంతిఁజేరె
ఎవ్వాని నీలంబు ♦ నీక్షింపఁ జాలక
జలధరంబులు జిష్ణు ♦ జెంతజేరె
ఎవ్వాని మోమంద ♦ వీక్షింపఁ జాలక
ఉడుపతి శ్రీశంబు ♦ నూత్నఁగొనియె
ఎవ్వాని బాహువు ♦ లీక్షింపఁ జాలక
వేషుండు భూమిలో ♦ జేసుకొనియె
గీ. నెవని నెఱికుంతలములతో ♦ నీటుగాక
అళినికాయంబు కందర్పు ♦ లమ్ముఁజేరె
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 18

కొలువుఁడీ జనులార ♦ గోవిందరాముని
భవదోష పుంజము ♦ బ్బాసిపోవు
తలఁచుడీ జనులార ♦ తారకరాముని
తాపత్రయాదులు ♦ తగ్గిపోవు
వినుతిసేయుడి ధీర ♦ మనుజులార రాముని
ఘన విపచ్ఛిలలెల్లఁ ♦ గరగిపోవు
సంస్తుతించుడి సదా ♦ సర్వవర్ణాశ్రమా
చారులజ్ఞానంబు ♦ జారిపోవు

గీ. ప్రకటిగుణులార శ్రీరామ భద్రు నెపుడు
దలచుచుండుడి మోక్షంబు ♦ దప్పకుండు
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ 19

శ్రీరమామణి నో ♦ సరసిజాయత భృంగ
చారు పంకజయుగ్మ ♦ సారచరణ
భోగీశనుత భక్త ♦ యోగికైరవశ్రేణీ
సంపూర్ణ శశికాంతి ♦ జాలవరద
రావణ కుంభక ♦ ర్ణాసుర మత్తేభ
హర్యక్ష వితత శౌ ♦ ర్య ప్రతాప
భూరిమహాపంక ♦ పుంజా భ్రచయగాఢ
ఝంఝానిలప్రభా ♦ సారమహిమ

గీ. ప్రకటిత గుణరత్నయుతభద్ర ♦ పంకజాక్ష
భక్తసంతత మందార ♦ పరమపురుష
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 20

శ్రీహరి ననుగావు ♦ చిన్మయాత్మకధీర
దానవాంతక నార ♦ దాది వినుత
శ్రీశౌరి ననుబ్రోవు ♦ శ్రీరామ రఘురామ
భానుకోటి ప్రభా ♦ భాగ్యనిలయ
శ్రీరామ ననుగావు ♦ శ్రీచిన్మయాకార
పంకజాతాక్ష శ్రీ ♦ భక్తవరద
శ్రీకృష్ణ ననుబ్రోవు ♦ శ్రీరమామణిమనో
సరసి జాతభ్రమర ♦ సార్వభౌమ.

గీ. నీలనీరద శుభగాత్ర ♦ నిగమవినుత
పరగమమ్మొప్పు బ్రోవుమా ♦ పరమపురుష
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 21

శతపత్ర సుతరుద్ర ♦ సన్నుతాంచిత గుణ
ప్రకటిశీల మహాను ♦ భావధుర్య
సరసి జాసన రుద్ర ♦ సన్నుతాంచిత దివ్య
పాదారవింద ప్ర ♦ భావరామ

ప్రకటిగుణోదార ♦ భక్తచాతకఘనా
ఘనవేణు మంజుల ♦ గానలోల
శ్యామమణీ ఘృణీ ♦ జాల తృణీకరాం
చితచారుదేహ శ్రీ ♦ చిత్తచోర

గీ. సర్వలావణ్యసాగర ♦ సారసాక్ష
గోపికాచిత్త చోర శ్రీ ♦ గోపబాల
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 22

సర్వేశ్వరాయని ♦ సన్ను తింపుచునుండు
సుగుణ వంతుని కేల ♦ శ్రుతిరవంబు
ఒకమారు నిస్గన్న ♦ సుజన పర్యుడుసదా
ప్రథిత బ్రహ్మైక్యంబుఁ ♦ బడయ నేల
నీ భక్తిగలిగున్న ♦ నియతిఁ జేరి భజంచు
స్థిరధీర శాలికి ♦ తపమ దేల
నీ కృపేక్షణభాగ్య ♦ నియతిఁ గల్గినభక్త
జనుల కేలను మహా ♦ జపము లరయఁ

గీ. పరగ మీనామస్మరణలోఁ ♦ బరగునరున
కేల నణిమాది సిద్ధుల ♦ పాలనంబు
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 23

పుడమి భాగవతాగ్ర ♦ పురుషు గౌతముకాంత
శాపాతురములవే ♦ సమయఁజేసి
శ్రీశ్వేత పాదోధి ♦ శ్రీకన్య స్వకరాంబు
జాతింబుల్దాల్చు ♦ చారుతములు
కామాది షట్కౌసం ♦ కలిత మనోన్మత్త
కాళీయ ఫణిపణా ♦ గ్రముల వెలయు
పరమ యోగాభ్యాస ♦ భరిత భాగవతాగ్ర
నివహమనముల లోన ♦ నిలిచియుండు

గీ. తాపహరమైన శ్రీపరం ♦ ధాముపాద
యుగము నెప్డు మదాత్మలో ♦ నుండుగాత
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 24

శ్రీమానితశ్యామ ♦ జీమూతసమ దేహ
కలితశ్యామలఘృణీ ♦ జాలములును
సలలితాంభోజాత ♦ స కాంతికరాశ్రిత
మమలవక్షోవైజ ♦ యంతిప్రభలు
స్వర్ణమము క్రొళ్ళి స్థగితచారు కిరీటి
రుచిరజాలమరీచి ♦ రుచిరములును
శ్రీమత్సునాఘన ♦ శ్యామకుంతలశోభ
భాగ్యావిత్యాబాధ ♦ భ్రాజితములు.

గీ. గల్గుశ్రీరామ చంద్రుండు కరుణయుంచి
బ్రోచుగావుత నన్నెప్డు ♦ పృథివియందు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 25

వరయోగిజనభక్త ♦ వర్ణితాంచితచారు
మందహాస ముఖాబ్జ ♦ మమరువాఁడు
భక్తజనావన ♦ ప్రకటితకృపామృత
లోచనాబ్జములచే ♦ లొలుకువాఁడు
కంబుసమగ్రీవ ♦ కలితసత్ఫుల్లార
విందదామంబుచే ♦ వెలయువాఁడు
ఘనచతుర్బాహుల ♦ గదశార్ఙ్గవరశంఖ
చక్రాయుధములచేఁ ♦ జలఁగువాఁడు.

గీ. పాదపంకజ గాఁగళిచేఁ ♦ బరగువాఁడు
ఇచ్ఛతోడమదాత్మలోఁ ♦ వెలయుగాత
ధరణిగుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 26

పరగ బ్రాహ్మణహత్య ♦ పాపాటవులకగ్ని
కీలలు హరినామ ♦ కీర్తనములు
జారసంభవపకర్త ♦ పాంథ ప్రకరభాను
కిరణముల్హరినామ ♦ కీర్తనములు

చోరసంఘాతాఘ ♦ శైలజాలములకు
వజ్రముల్లరినామ ♦ కీర్తనములు
మధుపాన దురితోరు ♦ మత్తేభములకును
కేసరుల్లరినామ ♦ కీర్తనములు

గీ. యనఁగ వెలసిన శ్రీహరి ♦ నామకీర్త
నములు నెప్పుడు నాత్మలో ♦ నమరఁగాఁత
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 27

నా చెంగటికి రాఁడ ♦ నళిన సంభవుని చేఁ
ముప్పొద్దుఁగొనియాడె ♦ ముఖ్యగురుఁడు
చూడఁడా నమృతంబు ♦ జూఱ్కులాత్మలయందు
జూచువారలఁగృప ♦ జూచువాఁడు
నన్ను రక్షింపఁడా ♦ నాగేంద్ర శయనుండు
సర్వభూత హితుండు ♦ సంతసమున
నామొరాలింపఁడా ♦ నతభక్త వరదుఁడా
శ్రితయోగిసంతాన ♦ పాదపముడు

గీ. అమర వినుతుండు శ్రీ ♦ రమా నాథుఁడైన
భోగిశయనుండు నన్నెప్పు ♦ డ్రోచుఁగాఁత
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 28

ఎవ్వాని మహిమంబు ♦ లెఱుఁగ నేరరు పితా
మహభర్గ దేవయ ♦ మాదులరయ
ఎవ్వాని పాదార ♦ విందయుగ్మంబుచేఁ
జట్రాయి నాతిగా ♦ జన్మమయ్యె
ఎవ్వాని పాదాబ్జ ♦ న ర్తనంబున శీర్ష
పై కాళి యుఁడు దాల్చె ♦ పాదగుర్తు
లెవ్వాని పాదంబునం ♦ దెల్ల ఋషులచేఁ
గొనియాడఁ బడుగంగ ♦ నుద్భవించె

గీ. నెవని యాజ్ఞకులోఁబడి ♦ ఎల్లసురలు
స్వస్వకార్యంబుఁజేసి ♦ జలగు చుంద్రు
ధరణి గుంతకల్లుకోటాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామ రామ. 29

భానుకోటిప్రభా ♦ భాసమాన హిరణ్య
నవము క్తయుతకిరీ ♦ టంబువాడు
బాహుచతుష్టయం ♦ బందు కౌమోద కీ
శంఖ చక్రాబ్జముల ♦ జెలగువాడు
భద్రవక్ష స్థలాం ♦ చితనై జయింతియు
వనమాల పుచులచేఁ ♦ దనరువాడు
క్షీరసాగరమందు ♦ శేషతల్పము గాను
పవళించి ప్రభులచేఁ ♦ బరగువాడు

గీ. దయవిలోకన మందస్మి ♦ తాస్యవాడు
నిచ్చనను మెచ్చి నాకోర్కె ♦ లిచ్చుగాత
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 30

పద్మగోధూమంబు ♦ పవిపతాకచ్ఛత్ర
ఝషనంకుశాంక + పా ♦ దాబ్జములు
భద్రనఖాంబునీ ♦ హారచంద్రిక ప్రభా
నిర్ధూత భక్తాఘ ♦ నిర్మలములు
నిజసేవ భక్తయో ♦ గీశప్ర ముఖభూరి
ఘోరాఘనగజాల ♦ కులిశములును
అగజా మనోహరా ♦ రుణజతాజాతాగ్ర
స్థానమందాకినీ ♦ సంభవములు

గీ. అనగ వెలసిన శ్రీమనో ♦ హరునిపాద
పద్మయుగ్మంబు నెల్లప్డు ♦ బ్రస్తుతింతు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 31

కల్యాణ యుతశంఖ ♦ చక్ర గదాచాప
రుచిర పద్మాంచిత ♦ ప్రో + జ్వలములు
శ్రీరమ్యకాంచినాం ♦ చితచారు ముక్తాళి
స్థగిత కంకణజాల ♦ రస్మితములు

సలలితంబైన శ్రీ ♦ సంతాన భూరుహ
సత్ఫుల్లసుమధామ ♦ కాంతిమములు
నీలాంబుధరతటి ♦ త్సినిర్జితాంచితచారు
రుచిరజాల శరీర ♦ రుచిరములును

గీ. గల్గినాచెంగటనుకృపా ♦ కలితుడగుచు
భక్తవరదుండు ప్రత్యక్ష ♦ మగునుగాత
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 32

ఎవ్వాని మహిమచే ♦ నీ ప్రపంచంబును
జననవృద్ధిక్షయలఁ ♦ జరుగుచుండు
ఎవ్వాని కరుణచేఁ ఎల్లదిక్పాలురు
పదవైభవములచేఁ ♦ బరగుచుండ్రు
ఎవ్వాని మహిమంబు ♦ లీప్రకారంబని
సంస్తుతింపగలేరు ♦ సకల మునులు
ఎవ్వాని సేవించఁ ♦ యెల్లవారలదోష
ములు పటాపంచలై ♦ పరుగులిడును

గీ. అట్టి పరమేశు శ్రీమనో ♦ హరుని రాము
భజని గావింపుడీ మోక్ష ♦ పదవి గనఁ
ధరణి గుంతకల్లుకొట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 33

సత్ఫుల్ల సరవింద ♦ సమనేత్రములవాఁడు
కరుణారసంబుపై ♦ జిలుకువాఁడు
సంపూర్ణ చంద్రమా ♦ సన్ముఖంబునువాఁడు
దరచారు హాసచేఁ ♦ దనరువాఁడు
కంబుకంఠమువాఁడు ♦ కలిత కౌస్తుభరత్న
వనమాలరుచుల ♦ వక్షంబు వాఁడు
నీలమేఘచ్ఛాయ ♦ నిరసింపఁగఁ జాలు
కాంతిదేహచ్ఛాయ ♦ కాంతివాఁడు.

గీ. పల్లవాగ్జాతములఁ గేరు ♦ పదయుగంబు
వాఁడు నెప్పుడు దాత్మలోఁ ♦ వనరుగాత
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామ రామ. 34

దండంబు శ్రీరమా ♦ ధవునకు సత్కాంతి
రుచులచే నెలుగొందు ♦ రూపునకును
దండంబు శతపత్ర ♦ దళనేత్రునకు హేమ
వరపీతకౌశేయ ♦ వాసునకును
దండంబు కేయూర ♦ కటకకంకణహార
వనమాల శ్రీవత్స ♦ వక్షునకును
దండంబు చంద్రికా ♦ ధవళకుందమనోజ్ఞ
హాసవదనాంభోజ ♦ హస్తునకును.

గీ. దండనూంచిత వరశీల ♦ ధర్మనకును
దండము త్తమవైకుంఠ ♦ ధామునకును
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామరఘురామ ♦ రామరామ. 35

పాలించరానన్ను ♦ పరమభక్త కదంబ
మందార భూరుహ ♦ మదనజనక
పోషించరానన్ను ♦ పోషితామరవర్గ
సంరక్షగజరాజ ♦ సన్నుతాంగ
కాపాడరానన్ను ♦ కంజాక్షవరద శ్రీ
వైకుంఠవాస శ్రీ ♦ వాసుదేవ
గాచిరక్షించరా ♦ కరుణామయాత్మ బృం
దారక ప్రముఖ సం ♦ స్తోత్రరామ
గీ. అనుచు పలువారునిన్ను నే ♦ ననుదినంబు
సన్నుతించెద బ్రోవరా ♦ సారసాక్ష
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 36

మోహనాకారనీ ♦ మోముతో సరిలేక
కనులారి హరికలం ♦ కమునఁ బడియె
హరినీదు నేత్ర యు ♦ గ్మంబుతో సరిలేక
పద్మములుబ్బదక ♦ మ ధ్వంబుఁ జేరె

కరుణామయాత్మనీ ♦ గళముతో సరిలేక
శంఖంబు ధ్వనిసేయ ♦ నాకనెప్పుడు
నిగమగోచరనీదు ♦ సొగసుతో సరిలేక
పుష్పబాణుడెమిోంకు ♦ పుత్రుడయ్యె
గీ. నీకు సరియెవ్వరిలలోనఁ ♦ నేర్పడంగ
దలచి చూచిన ఎందైన ♦ దాతగలడే
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 37

రక్షించితివి భీక ♦ రారణ్యమున గ్రాహ
బద్ధమై విలపించు ♦ భద్రకరిని
శిక్షించితివి ఘోర ♦ శీలపంక్తిగ్రీవ
కుంభకర్ణాసుర ♦ కూళవరుల
భక్షించితివిగోప ♦ భామలిండ్లలయందు
ఘృతదధిక్షీరము ♦ ల్గూర్మితోడ
వీక్షించితివి దేవ ♦ వివిధభక్తుల నెల్ల
కరుణామృతాబ్జలో ♦ చనముచేత
గీ. దుష్టశిక్షణ శిష్టసం ♦ రక్షణంబు
ప్రతి యుగంబున నొనరించు ♦ బరముదలతు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరాను. 38

రాజీవ దళనేత్ర ♦ రాజీవ సంభవ
ప్రముఖదేవస్తోత్ర ♦ పరమపురుష
మధుకైటభాంతక ♦ మదనకోటి స్వరూప
కంస సంహరణ శ్రీ ♦ కాంతరమణ
దామోదరహరీ ♦ దానవాంతకచక్ర
ధర శ్రీశ శ్రీచారు ♦ తులసిధామ
సుకవి జనస్తుత్య ♦ సుందరాంచితపాద
జంతుజాలమయాత్మ ♦ సారసైభామ

సీ. క్రంతుజనకాబ్జ భవనుత్త్య ♦ క్రంజనేత్ర
విమలచారిత్ర గుణశీల ♦ వినుతపాలా
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 39

భానువంశక్షీర ♦ పాథోధిరాకాకు
ముదబాంధవుని రమా ♦ చిత్తచోరు
రక్షితా ప్రహ్లాదు ♦ రాజీవదళనేత్రు
సారస సంభవ ♦ స్తోత్రపాత్రు
ద్వాదశాత్మహిమాంశు ♦ నేత్రయుగ్మమూర్ధిరు
ప్రకటితాంచిత గుణ ♦ ప్రకటశీలు
జంతుజాలమయాత్మ ♦ జంభాంతకామర
సందోహ సంరక్షు ♦ సారసాక్షు

గీ. ప్రకటి గుణధామ శ్రీరాము ♦ భక్తవరదు
భజనసేయుడి మోక్షంబు ♦ బడయవచ్చు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 40

శ్రీరాము రఘురాము ♦ చిత్రచారిత్రముల్
త్రైలోక్య జనవర్గ ♦ తాంచితములు
శ్రీరాము రఘురాము ♦ చిత్రచారిత్రముల్
భక్తయోగి హృదాబ్జ ♦ భాస్కరములు
శ్రీరాము రఘురాము ♦ చిత్రచారిత్రముల్
వివిధదోషలతాల ♦ విత్రమములు
శ్రీరాము రఘురాము ♦ చిత్రచారిత్రముల్
తాపత్రయాంబుధి ♦ ధారకములు

గీ. నిత్యసౌఖ్యానుకరణము ♦ ల్నిర్మలములు
ముక్తిపదమున కేగంగ ♦ మూలకములు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 41

ఎగసక్కెమునకైన ♦ నిందిరాధీశుని
బలుకంగలేనిదు ♦ ర్భాషితుండు
కలలోన శ్రీరమా ♦ కాంతుని పాదాంబు
జములుగొల్వని దుష్ట ♦ జనవరుండు

నవ్వుతాలకునైన ♦ నగధీరు కథనము
కీర్తింప లేనట్టి ♦ కిల్బిషుండు
తీర్థోత్సవంబుల ♦ తీరుగా శ్రీశుని
గుడి జేరఁబోవని ♦ కుజనవరుడు

గీ. దండితుండగు నా దండ ♦ ధరుని బంట్ల
హస్తనిర్ఘాత ముష్టిఘా ♦ తంబులంది
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 42

నవనిలో జన్మించి ♦ నంతకాలము నుండి
నీనామ స్మరణంబు ♦ నెంచనైతి
పలు కష్టపాటిలఁ ♦ బడుచున్నప్పుడైనను
నీనామ స్మరణంబు ♦ నెంచనైతి
కుజన సంతతితోడ ♦ గూడి యుండుటెగాని
నీనామ స్మరణంబు ♦ నెంచనైతి
ఉదర పోషణమందు ♦ నూల్కొన్న మతిగల్గి
నీనామ స్మరణంబు ♦ నెంచనైతి

గీ. పరగ నేనెంతో క్రూరుండ ♦ పామరుండ
చేరి రక్షింపరార శ్రీ ♦ చిద్విలాస
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 43

వక్త్రంబు నీనామ ♦ వన్నెగోరుచు నుండు
జిహ్వ నీకీర్తన ♦ జేయగోరు
హస్తము ల్నీపాద ♦ మర్చింపగాగోరు
శ్రవణము ల్నీకథ ♦ శ్రవణగోరు
చిత్తంబు నీసేవ ♦ జేయంగ గోరును
ఘ్రాణంబు నీతులశి ♦ ఘ్రాణగోరు
మూర్ధంబు నీచంద్ర ♦ మూర్తి గాంచనుగోరు
నయనము ల్నీదర్శ ♦ నంబుగోరు

గీ. నరయగా నాత్మనీదయై ♦ నలరుచుండు
బుద్ధి మీపాదములయందె ♦ బూనియుండు
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 44

సర్వేశ్వరుని చిత్ర ♦ చారిత్రముల్వినని
కర్ణయుగ్మము కొండ ♦ గవ్వులయరయ
పరమేశ్వరుని నామ ♦ పద్యాళి జదువని
రసనంబు భేకాంత ♦ రస్థమరయ
పక్షివాహను రూప ♦ మీక్షింపలేనట్టి
చక్షులు మయూరపిం ♦ చాక్షులరయ
పురుషోత్తముని పాద ♦ పూజనల్లేనట్టి
హస్తయుగ్మము శవము ♦ హస్తమరయ

గీ. శ్రీశుచరణ కమలగంధ ♦ రసాస్వాద
రక్తిలేని ముక్కు ♦ ఘ్రుష్టిముక్కు
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 45

పలుమారు నేనెంత ప్రస్తుతించిన గాని
పాడచూప వాదేమి ♦ భోగిశయన
పామగుండని నాదు ♦ ప్రక్కఁ జేరగరావో
ఏచందమో గాని ♦ ఎరుగరాదు
నీమాయ గడవంగ ♦ నేనెంత వాడను
కృపయుంచి బ్రోవుమా ♦ కుజన హరణ
నీమాయగడవంగ ♦ నేరరాభవపితా
మహాదేవ సంఘంబు ♦ మదినిదలప

గీ. నరయ గానాత్మనీదయై ♦ నలరుచుండు
భక్తవత్సల పరమేశ ♦ పరమపురుష
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 46

అత్యుగ్రభయదగ్రా ♦ హంబుపట్టుకు పాహి
యను సామజము బ్రోచి ♦ నాడవీవె
పాంచాలి సభలోన ♦ భంగంబునొందు న
ప్పుడు బ్రోవవేయన్న ♦ బ్రోచితీవె

పెనుబాధనలు పెట్టి పితృసంహరణంబు
గావించి ప్రహ్లాదు గాచితీవె
ద్రౌణి బాణజ్వాల జ్వలించి గర్భస్థు
డైయున్న శిశువును ♦ మనిచితీవె

గీ. యనుచు పలుమారు నిన్ను నే ♦ ననుదినంబు
భావమందున దలపోసి ♦ బ్రస్తుతింతు
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 47

శ్రీఘనాఘనముపై ♦ జెలగు కాదంబినీ
ప్రభశరీరంబుపై ♦ పటిమువాడు
ధర్మముక్తాస్థగిత ♦ మకర కుండలకాంతి
గండభాగంబందు ♦ గలుగువాడు
శతకోటి భాస్కరాం ♦ చితప్రభారత్న హా
టిక విరాజిత కిరీ ♦ టంబువాడు
సంపూర్ణ పూర్ణిమా ♦ చంద్రప్రభతగల్గు
వదనంబుగలమహా ♦ వన్నెవాడు

గీ. సారమకరంద తుందిల ♦ స్యందభరిత
వీక్షణాళిచె సాక్షాత్క ♦ రించుగాత
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 48

ఆగమకుల శ్వేత ♦ సాగరాంచితసోమ
సోమశేఖర స్తోత్ర ♦ సుప్రభావ
భావనా తీతవిభాస ♦ పంకజధామ
దామోదరా వరసు ♦ ధానిదాన
దానవాంతకరామ ♦ దశరథ శ్రీరామ
నామ శ్రీ చిత్తాబ్జ ♦ నళినవాస
వాసవప్రముఖ పి ♦ ద్వన్నుతాధార శ్రీ
ధారాధరశ్యామ ♦ దళితదోష

గీ. దోషములనుబాపునోష ♦ ధీశాధిప
అధిపులకును నధిప ♦ యభవవిభవ
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 49

శ్రీరామ మీాబాహు ♦ శౌర్యప్రతాపంబు
మృత్యుంజయునిచాప ♦ మునకు నెరుక
భక్తవత్సల మీాదు ♦ పాదారవింద ప్ర
భావంబు గౌతమీా ♦ పత్నికెరుక
పంకజాతాక్షమీా ♦ బాణాగ్ని వివరంబు
నసురసంఘము కెరుక ♦ నరసిచూడ
నారాయణునీదు ♦ నామమాధుర్యంబు
వరయోగి జనభక్త ♦ వరుల కెరుక

సీ. ఎరుగనాకును శక్యంబె ♦ వేదవేద్య
భవ్యచారిత్ర గోవింద ♦ భక్తవరద
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 50

నీరదేందు తుషార ♦ హారసన్నిభక్షీర
పాథోధిజాత శ్రీ ♦ భామరమణ
పరమేష్ఠి సమవర్తి ♦ పన్నగేంద్ర విభూష
ప్రముఖదేవస్తోత్ర ♦ భద్రచరణ
ఖల రావణకుంభ ♦ కర్ణానుజోన్మత్త
కలభ పంచాస్య శ్రీ ♦ శౌర్యభరణ
భయద తాపత్రయా ♦ భరిత సంతాపోగ్ర
తరమైన సంసార ♦ తాపహరణ

గీ. దీనజనతార్తి హరణ భ ♦ ద్రేభరక్ష
కనకవసచేల ముక్తస ♦ కరణాభరణ
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 51

నిన్ను నేనెంచెద ♦ నీకటాక్షంబున
స్వాదుమానమృతంబు ♦ చూపులలర
నామొరాలించియు ♦ నన్ను రక్షింపుమా
పలుమారు నిన్ను నే ♦ ప్రస్తుతింతు

దాతవై బ్రోవుమా ♦ దగ్గరన్నిల్వుమా
కరుణారసాంబుధి ♦ గడలుకొనగ
భారమా నను బ్రోవ ♦ భక్త కల్పకవృక్ష
నీ దాసకోటిలో ♦ నెగడుటకును

అరయ నను బ్రోవ నీవెగా ♦ కన్యులెవరు
పరగ రక్షించి బ్రోవరా ♦ పరమపురుష
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 52.

దొరకు నేనావంటి ♦ మూర్ఖులునకు భద్ర
కరమైన మీనామ ♦ కీర్తనములు
వెలయు నేనావంటి విషపూరితగుణునకు
న్నవహారంబైన మీ ♦ భక్తిరసము
సలుపు నే నావంటి ♦ చరమాన సుశుభవ్య
తరమైన మీపాద ♦ నర్చనంబు
గలుగు నే నాయట్టి ♦ కలుషాంధునకు శాంతి
దరహాస మైనమీ ♦ దర్శనంబు

గీ. నిత్యకల్యాణ గుణధామ ♦ నిర్మలాత్మ
నిగమసన్నుత పదపద్మ ♦ నీరజాక్ష
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 53.

శ్రీరామ రఘురామ ♦ సింధుబంధనరామ
నిగమసన్నుత దేవ ♦ నీరజాక్ష
సలలితేందీవర ♦ శ్యామదేహప్రభా
మణిగణాన్వితహేమ ♦ మకుటాభరణ
ఖలదానవ శ్రేణి ♦ ఖండితానంచితనోః ప్ర
తాపసంయుత నార ♦ దాది వినుత
హరసురవ్రాంత సం ♦ స్తోత్ర ధారుణిజాతి
చిత్తాబ్జషట్పద ♦ శ్రీనివాస

గీ. కంబుకంధర మందార ♦ కలితధామ
పాపవిధ్వంస నతభక్త ♦ పారిజాత
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ. 54

ఎవ్వాడు విశ్వంబు ♦ నిర్మించు పరిపాల
నము నాశనము జేయు ♦ సద నెఱింగి
ఎవ్వాడు ప్రళయాబ్ధి ♦ నిద్రితా వటపత్ర
శాయియై నాభిన ♦ చతురుఁ జేసె
ఎవ్వాడు నిజదాస ♦ నివహ సంతాపాబ్ధి
జాలము ద్రోలగించు ♦ సంతసమున
ఎవ్వాని తేజంబు ♦ నిన శశిగ్రహతార
అగ్నీశ్వరులకును ♦ నావహిల్లు

గీ. అట్టి పరమేశు నవ్యయు ♦ నార్తిపోషు
భవము లన్నియుఁ దెగిపోను ♦ ప్రస్తుతింతు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 55

సలలితాంభోజాత ♦ చారు పత్రఘృణిత
కరచతుష్క శ్రీవత్స ♦ కలితవక్షు
శ్యామ నీరదశ్యామ ♦ శ్యామోత్పల శ్యాము
భ్రమరాల కాంభోజ ♦ రాజధాము
శ్రీచారు కౌస్తుభాం ♦ చితరత్నహార శ్రీ
కంబు శ్రీశోభాభి ♦ కరణ గ్రీవు
చారు భక్తజన ప్ర ♦ సన్నాననాంభోజ
పద్మాప్తకోటి ప్ర ♦ భాసమాను

గీ. సతత మహానిలోలు సాను ♦ జనావనను
ఆశ్రయింతు బ్రోవ ♦ నను దినంబు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 56

పరమేశ్వరుని మీఁది ♦ పద్యాల్లదువంగ
పుణ్యమబ్బునో లేదో ♦ పుడమియందు
కమలనాభునికథ ♦ లాకర్ణముల్వినునట్టి
భాగ్యమబ్బునో లేదో ♦ బాగుమీర

శ్రీరామచరణంబుఁ ♦ జేరి మ్రొక్కఁగ నాకు
కోర్కెలీడేరునా ♦ కొదువ లేక
శ్రీమహారఘురాము ♦ చిరునవ్వు నొకసారి
జూచుభాగ్యము లేదొ ♦ సుందరముగ

గీ. పరగ శ్రీరామ నామంబు ♦ భక్తితోడ
పలుక భాగ్యంబు లేదేమొ ♦ ప్రకటితముగ
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామ రామ. 57

ఎంత వేడిన నీకు ♦ నింత కోపమదేల
పన్నగాంతక వాహ ♦ పంకజాక్ష
పాంచాలి సభలోన ♦ భంగమొందగ వేగ
గావ వేయనినంత ♦ గాచలేదె
కన్నతండ్రినిఁ బీడి ♦ కాననంబున బోవు
మని ధ్రువుం డెన్నను మనచలేదె
మాతంగ వల్లభుడు ♦ మకరిచే వెసఁజిక్కి
బోవ వే యనినంత ♦ బోవలేదె

గీ. ఇంత రేమైన నీకును ♦ ఇచ్చినార
పరగ ననుబోవకుండుట ♦ భావ్యమగునె
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామ రామ. 58

స్థిరముగా నీపాద ♦ సేవజేసెదగాని
జగతిలోజనుల చ ♦ ర్చనకుగాదు
జన్మసార్థకమంద ♦ సన్నుతించెదగాని
నలుగురిలో మెప్పు ♦ నందగాదు
మోక్షదానమునకై ♦ మ్రొక్కి వేడెదగాని
పాటిగా సిరులెల్లఁ ♦ బడయగాదు
నీనామ భజనంబు ♦ నెగడు విద్యయెగాని
ప్రథిత విద్యలుపొంద ♦ బడుటగాదు

గీ. ప్రకటితంబుగ మీపాద ♦ భక్తి గల్గి
భజన మందాత్మ నిల్పుచే ♦ పరమపురుష
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 59

సతతంబుమీపాద ♦ సరసిజద్వయములు
గతి యంచునమ్మితి ♦ గమలనాభ
రాత్రినాతిగ జేయు ♦ రక్షకుండని నేను
గట్టిగానమ్మితిఁ ♦ గరుణయుంచు
నేరమానావల్ల ♦ న్యాయమా నీవల్ల
ననుబ్రోవ కుండుట ♦ నమరవినుత
శ్రేష్టమానీకిది ♦ చేరి రక్షింపంగ
పొడజూపవాదేమి ♦ భోగిశయన

గీ. నీలనీరద శుభగాత్ర ♦ నిగమవేద్య
భక్తజనకల్ప భవహర ♦ బ్రహ్మజనక
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 60

అరయగానేన ♦ తీర్థములు సేర్చితిఁగాని
సాటించినత్యము ♦ బల్కనేర
ఘనకార్యములవి ♦ ఘాతంబొనర్చితిఁగాని
ప్రీతినదేయట్టు ♦ పేర్చనేర
పరధనంబపహరిం ♦ పంగనై పలుమారు
చిత్తంబు నెల్లప్డు ♦ జేర్చినాడ
ధర్మాది సత్క్రియల్ ♦ దలచిచేయగనేర
దివ్యమా క్షేత్రము ♦ ద్రిరుగనేర

గీ. కంజదళనేత్ర నేనంతో ♦ కల్మషుడను
గాచిరక్షింపరా వేగ ♦ కరుణతోడ
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 61

వాంఛితంబులు వేడ ♦ వచ్చుచుందు రటంచు
క్షీరసాగరమందు ♦ జేరినావు
నికట భాగంబందు ♦ నిల్చి వేడుదురంచు
శేష తల్పమునందు ♦ జెలఁగినావు

వెనువెంట దగిలివే ♦ చనుదెంచుచు రటంచు
నాగాంతకుని పైన ♦ నరిగినావు
మొగసాల కేతెంచి ♦ మ్రొక్కి వేడుచు రంచు
గట్టి దర్శకులను ♦ పెట్టినావు

గీ. బలముగల వాడనైతివి ♦ పరమపురుష
నిన్ను నేరీతిగ న్గొందు ♦ నీరజాక్ష
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 62

కిల్బిషారణ్యాగ్ని ♦ కీలంబు హరివిష్ణు
కేశవునామంబు ♦ కీర్తనంబు
భవదుఃఖజలధార ♦ పవనంబు హరివిష్ణు
కేశవునామంబు ♦ కీర్తనంబు
వాతపిత్తశ్లేష్మ ♦ వర్గాగహరివిష్ణు
కేశవునామంబు ♦ కీర్తనంబు

గీ. నిత్యసౌఖ్యానుబంధము ♦ లీనీరజాక్షు
కీర్తనంబులు పృథివిలో ♦ కీర్తితములు
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ 63

నరవర శ్రీరామ ♦ నరవింద సమనేత్ర
నిగమసన్నుత పాద ♦ యుగళభరణ

నీలనీరదగాత్ర ♦ నిర్జరస్తుతశీల
వైకుంఠవాస శ్రీ ♦ వాసుదేవ
ప్రహ్లాదసంరక్ష ♦ పన్నగేంద్రవిభూష
సంస్తోత్ర చారిత్ర ♦ సన్నుతాంగ
భక్తప్రకరకల్ప ♦ పాదపశ్రీరమా
కాంత మనోహరా ♦ కంతుజనక

గీ. నీరజప్రభసన్నుతా ♦ నిగమవేద్య
భవ్యచారిత్ర సుచరిత్ర ♦ పరమపురుష
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 64.

పరమాత్మ కేశవా ♦ పరమేశ జగదీశ
వైకుంఠవాస స ♦ న్మాన్యచరిత
దామోదరా పరం ♦ ధామ నారాయణ
మాధవా గోవింద ♦ మదనజనక
రఘుపతి శ్రీరమా ♦ రమణీ మనోహరా
నాగకంకణ సన్ను ♦ తాంగ భరణ
పాకారి సంస్తోత్ర ♦ భక్తవర్గస్తోత్ర
భువన రక్షణ భరణ ♦ పుణ్యచరిత

గీ. నిగమసంవేద్య చారిత్ర ♦ నీరజాక్ష
నిర్వికల్ప నిరంజన ♦ నిగమ వినుత

ధరణి గుంతికల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 65

గోవింద సర్వేశ ♦ గోవర్ధనోద్ధార
గోపికా జనచిత్త ♦ చోరనిలయ
సతభక్త రక్షపా ♦ పద్మాంస పరమాత్మ
నిగమ సన్నుతిపాద ♦ నీరజాక్ష
వాసుదేవ ముకుంద ♦ వైకుంఠవాస శ్రీ
వాసవ స్తుతనార ♦ దాదివినుత
చండదైత్యవిఖండ ♦ ఖండనోజ్వల రామ
పద్మసంభవ వినుత ♦ భక్తపాల
గీ. అతులితానంతకోటి సూ ♦ ర్యప్రభావ
చిన్మయాకార నిటలాక్ష ♦ వినుతశీల
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 66

రఘుకుల క్షీరపా ♦ రావార రాకాసు
ధాకరుండాశ్రిత ♦ త్రాణ వినుడు
దశముఖాది ప్రమత్త ♦ దనుజ మారణమహా
శౌర్య సంపన్నత ♦ స్సన్నుతుండు
బహుతర యుతభోగ ♦ భాగ్యవిశేష ప్ర
మోద యుక్తుండు దా ♦ మోదరుండు

నిరుపమాన యనూన ♦ నిస్తుల ప్రభవుండు
సర్వ దిగీశ్వర ♦ సన్నుతుండు
గీ. దశముఖ విలుంఠన క్రియా ♦ దక్షుడనగ
వెలయు హరిపాదముల్గొల్తు ♦ నింపుమీర
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 67

చారుడై ప్రతిదినా ♦ చారుడై పుణ్యా సం
చారుడై సత్సంగ ♦ చారుడగుచు
మేటియై వలశీల ♦ మేటియై జనసేవ్య
మేటియై సుజ్ఞాన ♦ మేటియగుచు
భద్రుడై నాయుధా ♦ భద్రుడై కుశల సం
భద్రుడై దీక్షాకీర్తి ♦ భద్రుడగుచు
ధీరుడై నాయుధా ♦ ధీరుడై దాతయై
ధీజనాశ్రితదేవ ♦ వృత్తిమగుచు
గీ. రాజ్యమేలంగ గలవాడె ♦ రాజుయరయ
మించి చరియించు రాజు భూ ♦ మిత్రిరాజు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 68.

పతియె దైవముయంచు ♦ భావ మంమనగల్గి
శుశ్రూష జేసేటి ♦ స్త్రీలలామ

అధితినభ్యాగతీ ♦ యతుల కాదరమున
బిక్షంబు నిడుమాని ♦ నీవతంస
అత్తమామల మాట ♦ నష్టుపెట్టని భామ
మానమే తోడవ్వగా ♦ మలయునాతి
ఉభయ వంశములకు ♦ నురుకీర్తి గల్గించె
పడతి సత్యంబుచే ♦ బరగు కాంత

గీ. క్రోధనిర్జిత వదనచే ♦ గోర్కెతోడ
సద్ప్రవర్తన గలకాంత ♦ కాంతయరయ
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 69

సురవర్యులకు నుండు ♦ స్వర్గంబునందున
చాకోరముల కుండు ♦ చంద్రునందు
చాతకంబుల కుండు ♦ జలధరంబుల యందు
నవనీ పతులకుండు ♦ నాజియందు
జగతీ సురులకుండు ♦ సద్విద్యయందున
కవులకుండు సువాక్కు ♦ గణమునందు
వ్యాధివంతుల కుండు ♦ నౌషధంబున యందు
సతివ సంఘముకుండు ♦ నధరమందు

గీ. భక్తులకునెల్ల నీనామ ♦ భజనయందు
నమృత ముండుట గనలేరు ♦ నవనియందు

ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 70

సత్యసూక్తులయందు ♦ సహనశీలములందు
రమ్యతంబగు గేహ ♦ రాజియందు
పరువిక్రమోపేత ♦ బాహువీర్యల యందు
ఛత్రచామర కేతు ♦ జయములందు
భూషణాంబరములఁ ♦ బూనోటలందున
ఘనసార కాశ్మీర ♦ గంధమందు
సస్యజాలములందు ♦ సరసీజములయందు
పంటభూములఁగాంచి ♦ పటిలమందు

గీ. సతత సౌభాగ్యగరిమంబు ♦ గలుగునెడల
సరవితోనుండు లక్ష్మిప్ర ♦ కాశమరయ
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 71

సత్ప్రవర్తనచేత ♦ సత్కీర్తి గల్గును
కీర్తిగల్గినచాల ♦ ప్రీతిగల్గు
ప్రీతిఁగల్గినయంత ♦ పెద్దని పేరొందు
పేరుగల్గినచాల ♦ ప్రేమవడయు
ప్రేమతో నేపల్కు ♦ పేర్కొన్న సరిపోవు
సరిపోవ నేపని ♦ సాగుచుండు

సాగినంతనె మేటి ♦ సత్కార్యమెదయందు
జేయగానలెనంచు ♦ జెలంగుచుందు

గీ. జెలంగినంతన సత్కర్మ ♦ జేసినరుడు
అక్షయ సుఖంబులందంగ ♦ నరుగునవని
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 72

ధనవిహీనుని మాత ♦ తప్పులే జెప్పును
భార్యచులకనగాను ♦ పల్కుచుండు
నోటవచ్చెడుమాట ♦ లొరులకు సరిపోను
తీరని దుఃఖంబు ♦ దెచ్చుచుండు
సభలోనికేగంగ ♦ సంకోచ మొదవించు
భాగ్యవంతునిగాంచ ♦ భయముదెచ్చు
శౌర్యంబు సన్నగిలు ♦ జ్ఞేయంగ నూల్కొల్పు
భావంబు కామ్యము ♦ ల్బడయగోరు

గీ. నహహ దారిద్ర్య మిట్లంచు ♦ నవయ నేల
పరగ శ్రీరామ సన్నిధి ♦ న్బడయగనుడీ
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 73

పరకాంతతో బొందు ♦ ప్రాణహానియు గల్గు
ఘనపరాక్రమవరుల ♦ కైనగాని

ఆదాయ మెఱుఁగక ♦ వ్యయముఁ జేయుట హాని
యక్షేశునకునంత ♦ వానికైన
ధనవంతుతోఁ బోరి ♦ తగవులాడుట హాని
పటుదేహ దుర్వార ♦ బలునికైన
కుజన సంతతితోడఁ ♦ గూడియుండుట హాని
వసుధేశు నకునంత ♦ వానికైన

గీ. పరగ మీఁదానకోటితోఁ ♦ బంతమాడ
హాని జేకుఱు నదిమది ♦ స్మరయలేరు
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 74

వాగ్జృంభణోపేత ♦ వైభవు గ్రిలకించి
పల్కుచుందు రసత్య ♦ ప్రౌఢములను
ఉపవాసనాది సం ♦ యుక్త వంతునిగాంచి
పల్కుచుందురు దంభ ♦ భరితుడనుచు
శ్రోత్ర ప్రియాలాప ♦ సుజను జూచినయంత
పల్కుచుందు రసార ♦ బలుఁడు యనుచు
దుర్వార బహుళశౌ ♦ ర్యౌర్య వంతునిచూచి
బల్కు దుర్నిర్దయ ♦ భావుఁడనుచు

గీ. ఎట్టి గుణవంతునైనను ♦ ఏదొ ఒకటి
తెరువుచే దూషణముఁజేయు ♦ దుర్జనుండు

ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 75

పతివిహీనంబైన ♦ పడతి బ్రతుకుట రోత
మతివిహీనునితోడి ♦ మైత్రిరోత
పెనులోభి యాచించి ♦ పెట్టుదానను రోత
తగని బంధుత్వంబు ♦ దలఁచరోత
ఆదాయ మెరుగక ♦ అప్పుదీయుట రోత
పరుల పంచలజేరి ♦ బ్రతుకరోత
జార చోరులగూడి ♦ సంచరించుట రోత
కలటి కనుర క్కుడై ♦ కూడరోత

గీ. భక్తవత్సల మీనాను ♦ భజనలేని
జనులచే గూడియుండుట ♦ చెడ్డరోత
ధరణి గుంతకల్లుకోట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామగామ. 76

కుల ముద్ధరించెడు ♦ కొడుకొక్కరుడెచాలు
పుట్టనేటికిఖలు ♦ ల్పుప్పుదిగను
తన్నుసంరక్షించు ♦ దాతొక్కరుడెచాలు
పరులచేఁ బోషింప ♦ బడుటకంటె
సారవంతముగల ♦ జమీనొక్కటేచాలు
ఊసరక్షేత్ర సా ♦ హస్రిమేల

కార్యానుకూలుడై ♦ ఘనుడొక్కఁడె చాలు
కార్యతజ్ఞత లేని ♦ ఘనుల కంటె

గీ. నరయఁగా మీదు నామ ప్ర ♦ భావమునకు
ఘనతముల్లోకముల నేది ♦ గాంచి చూడ
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 77

పరసతీ సంగంబు ♦ పాపంబటంచును
పరసతిపై నాశ ♦ పడుచునుండ్రు
బొంకులాడుటచేత ♦ బొందు నఘంబంచు
బొంకుచుందురు తామె ♦ ముందుగాను
కూట సాక్ష్యముచేత ♦ కూలు కీర్తియటంచు
కూటసాక్ష్యము సదా ♦ కూయుచుండ్రు
ధర్మమార్గము గల్గి ♦ తగవు దీర్చెదమంచు
చ ధర్మమార్గముతోన ♦ ఆడుచుండ్రు

గీ. సహహసీరీతి సీకలి ♦ కాలమందు
వ్యాఖ్యవంతు లసంఖ్యులై ♦ వరలె జగతి
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 78

తనబంధువర్గమును ♦ దనుకూల వృత్తియు
బరగించు పురుషుండు ♦ బడయు శుభము

నిజదాసవరులపై ♦ నెనగుగల్గిన ప్రేమఁ
బరగించు పురుషుండు ♦ బడయుశుభము
నీతికోవిదులందు ♦ నియతిమార్గంబుల
బరగించు పురుషుండు బడయుశుభము
మతివిహీనులత్రోవ ♦ మతిలేని మనమును
బరగించు పురుషుండు ♦ బడయుశుభము

గీ. శత్రుజనములశౌర్య వి ♦ క్రముడు యగుచు
బరగుపురుషుండు వేగంబె ♦ బడయుశుభము
ధరణి గుంతకల్లు కోట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ. 79

అత్యంతగౌరవం ♦ బమరజేయునుసాధు
సంగంబుసకలార్థ ♦ సాధనంబు
బుద్ధిమాద్యంబును ♦ బోనడంచునుసాధు
సంగంబు సకలార్థ ♦ సాధనంబు
సత్యమేజయమంచు ♦ జాటించుధరసాధు
సంగంబు సకలార్థ ♦ సాధనంబు
కల్మషాంతమునొంద ♦ కారణంబగుసాధు
సంగంబు సకలార్థ ♦ సాధనంబు

గీ. కీర్తిప్రకటంబు దిక్కుల ♦ గీలుకొల్పి
సంతసంబును గూర్చు ♦ సత్సంగమంబు

ధరణి గుంతికల్లుకోట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ.		80

మద్యపానముచేత ♦ మానంబుచెడిపోవు
కుమతి పుత్రునిచేత ♦ కులముచెడును
ఖలులసేవన సదా ♦ చారంబుచెడిపోవు
సతి వసంగంబుచే ♦ యతియుచెడును
సన్మార్గ లేమిచే ♦ సంపత్తు చెడిపోవు
మమతవిరసంబైన ♦ మైత్రిచెడును
దుర్మంత్రిచే ధరా ♦ రమణుండు చెడిపోవు
శ్రుతి హానివలన పా ♦ రుండుచెడును

గీ. నిజముల ననవిన్యో చెడిపోవు ♦ కొరుక లేక
విజ్ఞపీగుదు రదియేమి వెఱ్ఱిమతమొ
ధరణి గుంతికల్లుకోట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ.		81

కరిపైనను పింఛంబు ♦ కాలు బ్రవిసినయట్లు
వృకముపై ఊర్ణయు ♦ నేగినట్లు
సింగంబుపై గ్రామ ♦ సింగంబు చనినట్లు
వరపక్షి పైపాము ♦ వరలినట్లు
వృషదంశకంబుపై ♦ ఎలుక మార్కొనినట్లు
వ్యాఘ్రుంబుపై వృషభ ♦ మరిగినట్లు

అనిలు పై శాల్మలి ♦ నడకు చందంబున
అగ్నిపై శలభంబు ♦ నడరినట్లు
గీ. కుజన వసులెల్ల సిదాస ♦ కోటిపైన
నరుగుచుందురు తామంత ♦ మకుట గడక
ధరణి గుంతకల్లుకొట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ. 82

మందార మకరంద ♦ మనుభవించెడి తేటి
పోవునే వుమ్మెత్త ♦ పూలకడకు
గంగాతరంగ మా ♦ లికలనూగు మరాళ
మరుగునే ఘనప్రవా ♦ హమ్ములకును
నవచూత కిసలయం ♦ బారగించు పికంబు
గోరకునే వేపాకు ♦ కొనలనోటు
సంపూర్ణచంద్రజో ♦ త్స్నంబుగ్రోలు చకోర
మరుగునే విపులసి ♦ హారములకు

గీ. పంకజాతాక్ష మీనామ ♦ పఠనజేయు
నరుడ సత్కథమాలింప ♦ నరుగగలడె
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 83

పాలుసీరును వేరు ♦ పరుపనేర్చునె బక
శ్రేష్ఠములు హంసంబు ♦ తెలుగుగాక

కలవరంబులు పల్కు ♦ గాకంబు పల్కునే
పరికింపఁ గోకిల ♦ పల్కుగాక
మందయానముగల్గి ♦ మహిషంబు నడుచునే
అరయంగ మత్తేభ ♦ మరుగుగాక
కదము నడకనుగల్గి ♦ గార్దభం బరుగునే
తిలకింప తురగంబు ♦ తిరుగుగాక

గీ. అరయ నజ్ఞాని మీదివ్య ♦ నామ మహిమ
జెప్పతరమౌనె భక్తుండు ♦ చెప్పినట్లు.
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 84

అతిఘోరఘనసదవా ♦ నలముమ్రింగగవచ్చు
తిమిరినిసుకలో నూనె ♦ దీయవచ్చు
భుజపరాక్రమముచేఁ ♦ బులుల జంపగవచ్చు
పదునుఖడ్గముచేత ♦ నదుమవచ్చు
తరళత్తరంగసం ♦ ద్రంబుదాటగవచ్చు
డెంపుతోవనశాఖి ♦ దినగవచ్చు
చండాంశురుచులలో ♦ జలము ద్రావగవచ్చు
శేషుకంఠముజంక ♦ చేర్చవచ్చు

గీ. గానిమూర్ఖులడెందంబు ♦ గరగజేయ
వశముగాదెవ్వరికి నీప్ర ♦ పంచమునను

ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 85

గహనాంతరమునందు ♦ గాయు వెన్నెలరీతి
కీశకబ్బిన నారి ♦ కేశభాణి
వనధిపై వర్షించు ♦ వర్షధారలరీతి
ముష్టిచెట్టునఫల ♦ మ్ములవిధాన
పాడింటిదీపంబు ♦ పగిదినిల్పినయట్లు
పరగ షండునకబ్బు ♦ పణతివిధము
భర్తహీనంబైన ♦ పడతిచెలువమునూట్కి
ఫణి శిరస్సునవెల్గు ♦ మణివిధంబు

గీ. విశ్వమందున పెనులోభి ♦ వశముఁగోన
పరగధనముండి నష్టైన ♦ పనికిరాదు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 86

1 శూరవర్యునకలం ♦ కారశోభనమెద్ది
2 జూచువారలరూపుఁ ♦ జూపునెద్ది
3 పలువిధంబులరుచు ♦ ల్పాటించునదియెద్ది
4 కంసాహరణుదేహ ♦ కాంతియెద్ది
5 పరగ క్షత్రియులెల్ల ♦ పాలించునదియెద్ది
6 శితకంఠుశిరసుపై ♦ చెలగనెద్ది

7 దేహంబునకుబలము ♦ బెప్పించునదియెద్ది
8 హానుని గేహమున్న ♦ మరయనెద్ది
సీ. అన్నిటికినుండు మూడేసి ♦ నక్షరములు
నంమనంత్యాక్షరము ప్రభూ ♦ సంబుచుదయ
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 87

1 ఖడ్గము, 2 ముకుర, 3 నసన, 4 నలుపు, 5 పుడమి 6 మిన్నెను, 7 రుధర, 8 నగిరి.

1 జన్మమంతములేక ♦ జలగువారెవ్వరు
2 కాముని గన్నట్టి ♦ కాంతయెవరు
3 మృగకోటి చరియించె ♦ ముఖ్యవాసంబెద్ది
4 ప్రకృతి రుద్రాంశాన ♦ బరగునెద్ది
5 మాగధుండెంతె త్తె ♦ పాంచాలివింగ్లోప
6 కాంతల మోహంబు ♦ గానమెద్ది
7 నారసీరుహపత్రి ♦ సంఖ్య పేరెయ్యది
8 ప్రాణికోటికియుత్తె ♦ మూంగమెద్ది
గీ. అన్నిటికినుండునక్షర ♦ ద్వయమునందు
నాఘులుకుపంగ తుదలెల్ల ♦ నాఘునాను
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 88

ఉదా:- 1 సుర, 2 రమ, 3 మల, 4 లయ, 5 యవ, 6 వశ, 7 శత, 8 తల

1 పక్షి యుగ్మముగల్గు ♦ పర్వతంబన నెద్ది
2 అమరుల సంచార ♦ వాసమెద్ది
3 మండలాగ్రము ధరిం ♦ చుటకు తావెయ్యది
4 స్మరవిభంజను గేహ ♦ వర్ణమెద్ది
5 మిథిలాధిపతినామ ♦ మేమందు రిలలోన
6 జన్మాంతములచేత ♦ జలఁగు నెవరు
7 త్రిపురాంతకుని నామ ♦ ధేయంబనగ నెద్ది
8 కదలని నక్షత్ర ♦ కణమదేది

గీ. అన్నిటికిఁజూడ మూఁడేసి ♦ నక్షరములు
నందు మధ్యాక్షరము ప్రథా ♦ నంబు యరయ
ధరణి గుంతకల్లు కోటగ్యాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 89

---

ఉ॥ 1 మైనాక, 2 నాకము 3 కరము, 4 రజత, 5 జనక 6 నరులు, 7 రుద్రుడు, 8 ధ్రువుడు,

1 మండలాగ్రము ధరిం ♦ చుటకు స్థానంబెద్ది
2 స్మరవిభంజను గేహ ♦ వర్ణమెద్ది
3 పరగ భీష్మునిఁగన్న ♦ పడఁతి పేరెయ్యది
4 యుగమంత్య మగుటకు ♦ యొసగునెద్ది
5 వెన్నిచ్చి శ్రీకృష్ణు ♦ డెవనికి పరుగెత్తె
6 వనజాత సంభవా ♦ స్థానమెద్ది

7 ద్విజజాతి చరియించు ♦ చెన్నారు పేరువెన్ని
8 నక్షత్ర యుగమందు ♦ నమరు నెప్డు

గీ. అన్నిటికిఁ జూడ మూఁడేసి ♦ నక్షరములు
నందు మధ్యాక్షరము ప్రథా ♦ నంబుగల్గు
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామ రామ. 90

1 కలము, 2 రజని, 3 జలము, 4 లయము, 5 యవన, 6 వనజ, 7 నభము, 8 ధరణి,

అరయగాన్పై దక్షు ♦ రాలియందున నొక్క
ప్రాణిశ్రైలు విలసిల్లు ♦ బ్రకటితముగ
నందు మూఁడిట నాల్గి ♦ శైదిట స్వరముగా
బరగుచుండును మేటి ♦ ప్రాభవమున
తర్వాత ప్రథమయుగ ♦ తగ నంత్యసంధాన
జలమనంగను నొప్పు ♦ జగతియందు
ప్రప్రథంబును చతు ♦ ర్ణంత్యాక్షరాళిచే
జరమనంగను గల్గు ♦ సరవితోడ

గీ. అట్టి పదమేది జెప్పుడీ ♦ నరసి వేగ
భావనార్థంబు మీరనమై ♦ బరగవలయు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామ రామ. 91

ఉ.తా॥ జలచరము.

త్రిపుర సంహారు కోవె ♦ శంబున కెన్నియో
సోపానములు యుండె ♦ చోద్యముగను
నాభార్గవుని పాద ♦ నరవిందముల్గాంచ
సప్తఋ లరుదెంచి ♦ సంతసమున
ప్రథమవర్యుడు లెక్క ♦ పరిగణింపగ వేగ
క్రమముగా తమసంఖ్య ♦ గలిగినటుల
నార్గురారోహణం ♦ బమరంగ జేయంగ
నొక్కొక్కట రయగా ♦ తక్కువయ్యె

గీ. సంత సప్తమయోగీంద్రు ♦ డటుల జేయ
శేష మేమియు లేకను ♦ జెలగె జెపుడీ
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 92

ఉదా॥ 119 సోపానములు యుండెను.

రంజిల్లునెదతు ♦ రంబులనొకమాట
సందులోయుగనాశ ♦ మమరుమకరి
త్రీచతుష్పంచము ♦ ల్తగగూర్చ హస్తంబు
తగచతుష్టయమాది ♦ తలపలక్కొ
ప్రథమనాల్గవయుతు ♦ రాశిచే విలసిల్లు
కరమంద్రయంత్రంబు ఘనతగల్గి
తలపంగనంద్రైచు ♦ నాల్గతురంబుల
జలగుచుండును నిశా ♦ చరుడనంగ

గీ. ప్రకటితంబుగ యామాట ♦ బరగుచుండు
మధుపురోత్రిలంగ జనుప్రాణి ♦ యందు జెప్పడీ
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 93

---

ఉదా:—మధుకరము.

సంపత్తుగలుగనె ♦ సహనశీలములందు
నూల్కొల్పమతిని దా ♦ నుంచవలయు
పరగనాపదలందు ♦ పరికించి ధైర్యంబు
నింపుగామదియందు ♦ నింపవలయు
ఆస్థానములవా ♦ క్చాతురీత్వంబును
గలఁగంగధైర్యంబు ♦ గలుగవలయు
సంగ్రామములయందు ♦ జక్కనై పటుబాహు
విక్రమంబునుజూప ♦ నెసగవలయు

గీ. సరవితోడఁతమీనామ ♦ సన్నుతికిని
దలఁప మనుజుండు మదినిదా ♦ దలచవలయు
ధరణి గుంతకల్లుకొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ. 94

మీదివ్య నామసం ♦ కీర్తనంబులచేత
రమ్యమొందింపనా ♦ రదుడగాను
చిఱుతప్రాయమునందె ♦ చెలఁగుమీ పదభక్తి
గలిగున్న ప్రహ్లాద ♦ ఘనుఁడగాను

అనయంబుమీఁదిన్య ♦ నామస్మరణ సల్పి
సంతోషమును జేయ ♦ శబరిగాను
మీచిత్రకథలెల్ల ♦ జేర్చి సగ్రంథంబు
వ్రాయబూనగ కవీ ♦ శ్వరుడగాను

గీ. అరయగా మీకృపాపీఠ ♦ ణాళివలన
వ్రాసియున్నాడగై కొమ్ము ♦ వనజనయన
ధరణి గుంతకల్లుకొట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ. 95

అన్నవస్త్రములిచ్చి ♦ నట్టిదాతనుతాను
మనినంత కాలంబు ♦ మరువతగదు
ఉపకారమును జేసి ♦ యున్నట్టి సుజనుని
మరువరాదెన్నడు ♦ మరుపుగల్గి
కరువుకాలంబందు ♦ కష్టముల్నెడబాపు
మనుజవశ్యనిబడా ♦ మరువరాదు
పుడమినాపత్కాల ♦ మందుసాహాయ్యంబు
గలుగజేసినధీరు ♦ మరువరాదు

గీ. ధరణి తనమేలుకోరక ♦ తదితరులకు
మేలుగూర్చెడి సత్కీలు ♦ మరువతగునె
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 96

తనకుల విద్యచే ♦ దగజీవనము జేయు
టరయగా నుత్తమం ♦ బవనియందు
వాణిజ్యకృషిగల్గి ♦ వసుధజీవించుట
మధ్యమంబరయగా ♦ మదినిదలప
పెఱవారి యాజ్ఞలో ♦ న్మెలంగిజీవించుట
నధమంబనంగను ♦ నలరుచుండు
బ్రతుక జాలకదాంగ ♦ పనులచే సంసార
మును జేయవలెనన్న ♦ మృతియె మేలు

గీ. భువిని మీనామనుతి లేని ♦ పురుషుడవని
బ్రతికియుండిన ఫలమేమి ♦ పరమపురుష
ధరణిగుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 97

పక్షివర్గములోన ♦ బరగుచండాలంబు
గాకంబునరయగా ♦ జగతియందు
మృగకదంబంబులో ♦ నెసగుచండాలంబు
గాడ్దభంబరయగా ♦ జగతియందు
యోగాభ్యసులలోన ♦ నెసగు చండాలుండు
ఘనకోపియగు వాడె ♦ జగతియందు
మర్త్యులలోసర్వ ♦ మర్త్యుల నిందించు
వాడె పోచండాలు ♦ డనగ నెగడు

గీ. ధరణి మీనామ సన్నుతి ♦ సల్పఁడేని
వాఁడె సర్వత్ర చండాలుఁ ♦ డనఁగ నెలయు
ధరణి గుంతకల్లు కొట్టాల పురనివాస
రామ శ్రీరామ రఘురామ రామరామ 98

కులదీపకుని గాంచి ♦ కులము తా నుప్పొంగు
ప్రజల సేమముగాంచి ♦ ప్రభువుపొంగు
భర్తసన్మానంబు ♦ పడతి తా నుప్పొంగు
తనయుండు ఘనుఁడైన ♦ తండ్రిపొంగు
దారిద్ర్యవంతుండు ♦ ధనముగాంచను పొంగు
దాన మర్థునకిచ్చి ♦ దాతపొంగు
జయమందు శూరుండు ♦ చాల తా నుప్పొంగు
దాహవంతుఁడు జలము ♦ గాంచిపొంగు

గీ. పరగ నీభక్తుఁడుప్పొంగుఁ ♦ బ్రవిమలాత్మ
భవతుపాదారవింద యు ♦ గ్మముల గాంచి
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 99

ఉల్లిగడ్డకు పాన ♦ కోదకం బిడినంత
తనకంపు విడువంగ ♦ తరముగాదు
క్షీరాంబునిధియందు ♦ జేర్చి కడగినగాని
కాకిరెక్కకు తెల్పు ♦ గాంచరాదు

ఎనుబోతునకువిద్దె ♦ లెన్ని నేర్పినగాని
మడుగులో పొర్లాడ ♦ మానగలదే
శునకంబునకు ధర్మ ♦ సూక్ష్మముల్దెప్పిన
ఎంగిళ్ళు నాకుట ♦ ల్విడువగలదె
గీ. ధరణి దుర్గున కెన్ని స ♦ ద్వస్తువులచె
మేలుగూర్చిన తననైజ ♦ మిడువగలడె
ధరణి గుంతకల్లు కోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 100

కొండంత విత్తంబుఁ ♦ గొనిచనినిచ్చిన
భోగకాంతకుఁగూర్మి ♦ పుట్టఁబోదు
బహుమంది పుత్రులఁ ♦ బడసినప్పటికైన
పుత్రోదయభ్రాంతి ♦ పోవదెపుడు
సర్వంసహాచక్ర ♦ భరణంబుగలిగున్న
రాజ్యాభిలాషమిం ♦ తైనదీఱ
దైశ్వర్యవంతుడై ♦ యలరుచుండినగాని
ధనముపైఁ గాంక్షయుఁ ♦ దరుగదెపుడు
గీ. నవనినీరీతినరులకు ♦ నంతకంత
కంతరంగంబు నధికమై ♦ గలుగుచుండు
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 101

మత్స్యావతారివై ♦ మడుఁగులో వెసజొచ్చి
దనుజ వర్యునిద్రుంచి ♦ దనరితీవె
కూర్మావతారివై ♦ కుధరంబుఁబీఁపునఁ
దాల్చి వేల్పుల బ్రోచి ♦ దనరితీవె
వరహావతారివై ♦ వనిధిలో మున్గిన
ధాత్రీతలముఁ నెత్తి ♦ దనరితీవె
నరసింహరూపంబు ♦ నంది దైత్యేంద్రుని
ద్రుంచి బాలకుబ్రోవ ♦ నెంచితీవె

గీ. అట్టి పరమేశ మీరూప ♦ నామమెన్న
నజునకైనను శక్యమా ♦ నరసిచూడ
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ. 102

రాజులఁ
రుమున
)త్రుఁ
టుడవీవె
) ,
౦లివీవె

కృష్ణావతారంబు ♦ గొనియుకంసోన్మత్త
దుష్ట రాక్షసులను దఁంచితీవె

గీ. అట్టి మీదివ్యశౌర్య ప్ర ♦ భావమరయ
శేషునకు నెంచశక్యమా ♦ శ్రీనివాస
ధరణి గుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామ రఘురామ ♦ రామరామ.　103

1 ప్రజల సుఖ దుఃఖము ♦ ల్పాటించితమవలె
పృథ్వీపాలనఁ జేయు ♦ పురుషులెవరు
2 అరిషడ్గుణ త్రయం ♦ బరయగా నందులో
పంచమపదముగా ♦ బరగునెద్ది
3 చతురుపాయములందు ♦ జర్చింపరెండవో
పాయంబనంగను ♦ బరగునెద్ది
4 క్షీరార్ణముద్రచ్చ ♦ జేరివాసుకియొక్క-
పుచ్ఛంబుఁబట్టిన పుణ్యులెవరు
గీ. వీనిప్రథమాక్షరములఁగ ♦ వీక్ష్వరుండు
వెలఁగునాచంద్రతారార్క ♦ జగతియందు
ధరణిగుంతకల్లు కొట్టాల ♦ పురనివాస
రామశ్రీరామ రఘురామ ♦ రామరామ.　105

---

1 రాజులు, 2 మదము, 3 దానము, 4 సురలు.

విషధరరిపుగమన ♦ విషగుహాయత నేత్ర
విషగళసఖునీకు ♦ మంగళంబు
పాదోధి సంచార ♦ పాదోధి గంభీర
పాదోధినుతనీకు ♦ మంగళంబు

కమలసూత్రసరసీజ ♦ కమలాప్త కమలాప్త
వంశాబ్ధి శశినీకు ♦ మంగళంబు
నీలనీరదగాత్ర ♦ నీలనీరద వాహ
నిర్జరస్తుతనీకు ♦ మంగళంబు

గీ. పంకజాతాక్ష పంకజ ♦ ప్రభవవినుత
నీకు మంగళ శతములు ♦ నిగమవేద్య
ధరణి గుంతకల్లుకోట్టాల ♦ పురనివాస
రామ శ్రీరామరఘురామ ♦ రామరామ. 105

## గ ద్య ము.

ఇది శ్రీమద్రమారమణ చరణారవింద సేవా కృపాలబ్ధ
కవితావిచిత్ర కల్వటాలపుర యజమాన కోదండ
రామరాజ సుధీపుత్ర రామదాసాఖ్య
ప్రణీతంబైన శ్రీరామ రామ
శతకము సంపూర్ణము.

ఓమ్ తత్, సత్.